శ్రీరస్తు.




స్త్రీల కత్యంతోపయో[illegible]ంబుగ

ప్రాచీన కవి పుంగవుల[illegible]

రచియింపఁబడిన

---

# రుక్మిణీదేవి సీమంతము.

---



ఇయ్యది

పోతాప్రగడ వేంకటరత్నమ్మగారిచే

విశాఖపట్టణమందు

శ్రీశారదామకుట ముద్రాక్షరశాలలో

ముద్రింపించి ప్రకటింపంబడియె.

500 కాపీలు.

---

వెల 1 అణా.

---


VIZAGAPATAM:

Printed by A, Venkatareddy, at the S. S. M- Press.

1897.

శ్రీరస్తు.

స్త్రీల కత్యంతోపయోగంబుగ
ప్రాచీన కవి పుంగవులచే
రచియింపఁబడిన

# రుక్మిణీదేవి సీమంతము.

ఇయ్యది
పోతాప్రగడ వేంకటరత్నమ్మగారిచే




విశాఖపట్టణమందు
శ్రీ శారదాముకుట ముద్రాక్షరశాలలో
ముద్రింపించి ప్రకటింపఁబడియె.

వెల 1 అణా.

VIZAGAPATAM:

Printed by A. Venkatareddy, at the S. S. M. Press

1897.



శుభమస్తు.



# రుక్మిణీ దేవి సీమంతము.



శ్రీకృష్ణుని రాణికినీ శ్రీరుక్మిణిదేవికినీ। ఇంతికి గర్భపు చిన్నె
లు వింతలుగా నైకొనెనూ। ఒకిలింతలుఘనమాయెను శ్రీకాంతుని
రాణికినీ। చేకొని గోడలమృత్తిక భక్షింపుచునుండే। అన్నముయిం
చుకతినదూ ఆకలిపలుమారనదూ। పట్టెడి దర్భెడినైకొని నెలత
రో ప్రొద్దులుబుచ్చూ। శుభకంఠము సన్నమాయెను శుభకోమ
లాంగికనిపుడూ। స్వారపు ఫలములమీదనె కోరిక లగ్గలమాయే।
ఆవలింతలు ఘనమాయెను శ్రీకాంతుని రాణికినీ। పణతీపట్టిమంచ
ముపై పలుమారూ పవళించూ। ఆచందము గని చెలులూ యింతి
కి తామిట్లనిరీ। నీవున్నా విధములు మరి మాకేమీ తెలిసుండవు।
అన్నము నించుకతినవూ ఆకలి పలుమారనవూ। పట్టెడి దర్భెడి
నైకొని నెలతరో ప్రొద్దులు బుత్తూ। శుభకంఠము సన్నమా
యెను శ్రీలక్ష్మీరానీకూ। శ్రీకృష్ణుడువిన్నా మరికోపించునో యేమ
నునో। ముగిదె నీవు నీళ్ళోసుకు మునుకొని మూడు నెలలాయే।
ఇంతికి గర్భము నిజమని యెంతో సంతోషించ్రీ। ఎంతోసంతో
షించీ యశోదకు నెరిగించ్రీ। మీకోడలివిధములు మరిమాకేమని తె
లిసుండవు। అన్నము నించుకతినదూ ఆకలి పలుమారనదూ। ప
ట్టెడిదర్భెడినైకొని నెలతరో ప్రొద్దులుబుచ్చూ। శుభకంఠముసన్న
మాయెను శుభకోమలాంగికినిపుడూ। స్వారపుఫలములమీదనె కో
రికలగ్గలమాయే। ఆపలుకులువిని దేవకియెంతో సంతోషించే। తన

ముద్దూకోడలినీతనవద్దర బిలచుకొనీ। కుచములనందముకులగిరులూ
హేమకలశమ్ములబోలూ। బింబము పాండురవర్ణముబోలున్నదిని
జమనెనూ। కావలసినవస్తువులూ ప్రేమతో తా దెప్పించీ। కావలసి
నవస్తువులూ చెయమని చెలులకు జెప్పే। అంతట చెలులతో రుక్మి
ణి బంగరు మేడలకేగే। సంపెగ తైలము రుక్మిణి దేవికినీ శిరసం
ట్రటి। గంధమ్మూ కస్తూరీ కాంతకు నలుగులు బెట్టీ। సుగంధ జల
ములరుక్మిణిదేవికి జలకములార్చీ। నిండువన్నె తెల్లోవత్తిరి నీరజా
క్షికి వేడుకతో। బంగరు పటుపీతాంబరము కట్టనిచ్చిరి వేడుకలా।
సకియకు తలకురులార్చిరి సంపెంగా విరులానూ। బంగరు మొగలి
రేకులతో పటుసవరములో కొప్పీడీ। ఇరుగడలా సూర్యాచంద్రా
దుల నమరగనిలిపీ। హరిశ్చంద్రముత్యాలాబొట్టు మెరయగా బె
ట్టీ। కేళించిన ఆణిముత్యాలా బావిలీలు మెరయగనూ। శశిపువ్వ
మరగనుంచెను చంద్రవదన వేడుకతో। మోపునత్తిగెలు బెట్టెను ము
ద్దరాలు వేడుకలా। ఒడ్డాణంబులు బెట్టెను వైడూర్యంబులు వెలు
గా। ఒత్తులుభుజకీర్తులు సందెటిదండలు వెలుగా। పాదంబునయం
దెలు పాయినట్టములూ మెరయగనూ। నెమలడుగులపిల్లాళ్ళూ న
వముద్రికలు మోగియగనూ। చిటికెన బొద్దులు బెట్టెను శ్రీరు
క్మిణి తనవేళ్ళా। పంచరత్నంబుల బటువులు పంకజాక్షి ధరి
యించీ। కస్తురితిలకముదిద్దెను కమలాక్షితననుదుటా। సోగకన్ను
లను ఎన్నప్రకాటుకలమరగదిద్దే। చేడెకుచంద్రకావీరవికెదొడగి
రినేడుకతో। శృంగారంబులు జేసిరిశ్రీరుక్మిణిదేవికినీ। అంగనముంద
రబంగరుపళ్లెరములు దెచ్చించీ। దివ్యాన్నంబులు పెకూ్యాపిండి
వంటలుకూరగాయలనూ। పచ్చళ్ళూ మొదలైనా పంచభక్ష్యపర
మాన్నములూ। దధిమధుఘృత సూపంబులు వడ్డించిరి యింతులు
నూ। ఆదధిఘృత సూపంబులువడ్డించిరి పణతులనూ। ఆరగించిరి

రుక్మిణి హస్తంబులు గడుకుకొని। శ్రీకృష్ణుడు యుండేటి చిత్తరు
మేడలకేగే। ఇరుగడలా ముత్యాలా చిత్తరవ్వా పందిళ్ళ్యా। ఇరు
గడలారత్నాలా చిత్తరవుల కిటికీలూ। బంగరుపటువస్త్రము దెచ్చి
పానుపుపైపరగావించీ। పారిజాతకుసుమంబులు పానుపుపై పర
పించీ। పవళించెను శ్రీరుక్మిణి పంకజాక్షి వేడుకతో। అతివలుయి
ద్దరు గూడుకు ఆకులుమడచియ్యగనూ। పడతులు యిద్దరు గూడు
కు పాదమ్ములు బట్టగనూ। వనితలు యిద్దరు గూడుకు వీవనలను
విసరగనూ। ఇందుముఖులెల్లాగూడుకు తమ కొలువులు శాయగ
నూ। పవళించెను శ్రీరుక్మిణి పంకజాక్షి వేడుకతో। అంతటవసుదే
వుడు తన సఖి దాయకు మేతెంచీ। మహి ఆరు నెలలామెనా
మనరుక్మిణిదేవికినీ। చేడెకుసీమంతమ్ములు శాయగవలెనని పలికే।
శ్రీకృష్ణుడు రాడేడనుచూ అడిగెనువసుదేవుండూ। ఆరునెలలామె
నుకృష్ణుడు అంగటికే రాలేదూ। ఏవేళా శ్రీకృష్ణుడు వేలాస్త్రీల
తో ఉండూ। పదియారువేలకు కృష్ణుడు లోలుండై తిరుగుచునుం
డూ। ఒప్పరు యిదినామనసుకు ఒప్పదనుచు తా బలికే। ఆపలుకు
లువినిజనులూ అతిభయపడుతూ వెళ్ళి। రాజనగరులన్ని వెదకిరి రా
మకృష్ణుల నపుడూ। సత్యాంగనతో కృష్ణుడు సరసమాడుచునుండ
గనూ। స్తంభాలచాటుననిలచీ కనుసంజ్ఞలుచేయుదురూ। కనుసం
జ్ఞలవారికినిచేయిసంజ్ఞలజెప్పంపే। భామామణిరో సత్యాభామా
మణిరో వినవే। మనభక్తుడు అక్రూరుడు మనకువిందులమరించే। ఆ
రగించివచ్చెనే అతిశీఘ్రమ్మున నేనూ। మజ్జన భోజనమ్ములకే సజ్జప
రుచుకయుండుమనెనూ। ఆపలుకులువినిచెలియా పతిముఖమే తా
జూచీ। వేగపోయిరాకృష్ణా వేగపోయిరమ్మనెనూ। తనసతిపలుకు
లకూ చాలాసంతోషించీ। శృంగారమ్ములుఆమెను శ్రీకృష్ణుడు వేడు
కతో। చీనిచీనాంబ్రముగట్టెనుదివ్యమైనసొమ్ములుబెట్టే। శిరస్సునర

త్నకిరీటముధగధగ మెరయగనుంచే। వక్షమ్మున శ్రీతులసీవనమాలిక
ధరియించీ। కౌస్తుభాంకితపతక ముకర్ణకుండలమ్ములు మెరయా। మక
రకుండలమ్ములు బెట్టైను పురవీధులు మెరయగనూ। శంఖచక్రగజప
ద్మమ్ములు అంబుజచతుర్భుజసఖుడూ। బంగరుపువ్వులశాలూ వల్లె
వాటుగావేసే। ఉరమునబంగారూ ఉత్తరజందెమువేసే। చిలుక
చేతబట్టుకొనీ పలికించూకుట్టూనూ। వేణునాదమ్ముల నాదము
నాదమ్ములనూదుచునూ। నాదమ్ములు విని గోవులు గోపాలకులేతెం
చీ। డికరింపుచుతనచెవులా డికరింపుచువింటూనూ। సవ్వచు
గోవులశిరసుబుదువ్వచు గోపాలుండూ। వచ్చితండ్రికి మ్రొక్కె
ను వనజాక్షుడు వేడుకతో। పాదపద్మంబులనున్నా తనయుణ్ని
దీవించీ। ఆలింగనంబులు జేసుకు అంబుజాక్షునికిట్లనెనూ। ఏమిర శ్రీ
కృష్ణా యెన్నడుయింటికి రావూ। ఆరునెలలాయెను నీవునా అంగ
టికే రాలేదూ। వేడుకతో కొమాళ్లగని యెటి వేళలాయె రానాతం
డ్రీ। బాలుడవై తిరిగేవు గోపాలకులనుగూడీ। తండ్రిచేత శ్రీకృష్ణుడు
తగుదీవెనలందుకునీ।వచ్చితల్లికిమ్రొక్కెనువనజాక్షుడు వేడుకతో।
పాదపద్మంబులనున్నా తనయుణ్ని దీవించీ। ఆలింగనంబులు జేసు
కు అంబుజాక్షీ యిట్లనెనూ। ఏమిర శ్రీకృష్ణా యెన్నడు యింటికి
రావూ। ఆరునెలలాయెను నీవునాఅంగటికే రాలేదూ। వేడుకతో
కొమాళ్లనుగని యెటి వేళలాయె రానాతండ్రీ। బాలుడవై తిరిగేవూ
గోపాలకులనుగూడీ। తల్లిచేత శ్రీకృష్ణుడు తగుదీవెనలందుకునీ। మేలి
మైనకనకంపూమేడలదరికే తెంచే। అంతటసత్యాంగనతన కాంత
చెలిని బిలుచుకొనీ। అతివరొవినవే కృష్ణుడు యెచ్చటికేగెనొ తా
నూ। అక్రూరుని యింటికివిందులుఆరగించవతెనానీ। అక్రూరొ కృ
ష్ణుడు జెప్పి యెకడికేగెనొ తానూ। హరియెక్కడ నున్నాడో ఆ
వృత్తాంతము తెలియా। అతివేగమ్మున రమ్మని చెప్పం పెనుచెలితానూ।

సత్యాంగనబంపినచెలియా సరగునతానే తెంచీ। మేలిమైన కనకం
పుమేడలదరికే తెంచే। ఇరుగడలాముత్యాలా చిత్రరత్నలకిటికీలూ।
బంగరుకిటికిల చాటున దాగెనుచెలి తానూ। అంతట శ్రీకృష్ణుడుత
నసతిదాయకు నే తెంచే। నిద్రించీయున్నట్టియె నీరజాక్షిని పొడగ
నెనూ। స్త్రీలకు ముఖ్య శృంగారము యెడ ముత్యములు గలవా।
భూషణమ్ములు గలవింకా భన్న స్వరములుగలవూ। స్త్రీలకు ముఖ
శృంగారము చూడను తానెన్నె నూ। అతివరుముఖమునచెమటని
హరితానప్పుడు దెలసీ। తాగప్పినబంగారూ శాలూ చెంగన దు
డచే। హరిచెమటలు దుడవగానే అతివ తాను మేల్కొనెనూ। అ
పరాధములని కృష్ణునిపాదమ్ముల కేయొరగే। నవరత్నపు సింహాసన
మ్మున కూర్చుండగ తాబెట్టే॥ లోహాసనమ్మున కృష్ణుని పాదమ్ములు
తాగడిగే। పాదతీర్ధమ్ములు తానూ పైజల్లూకొనెనూ। వీవనలను
పుచ్చుకునీ విసరెను తెనపతికప్పుడూ। పతితెన మోహామ్మన అ
తివముఖము తాజూచీ। పసిడిషళాకైనట్టి తెళతెళ నేత్రసిజూచీ। ఇ
న్నాళ్లావలెగాదే ఇంతిరోనీకసియాడీ। నడుమేపోడుగైయున్నది
విడువకయిది యేమనెనూ। అనికృష్ణుడు బలుకగనూ విని రుక్మిణి
సిగ్గుననూ। తలవంచుకు యున్నట్టీ సతికరములు తాబట్టీ। గంధ
మ్మూకస్తూరీ కలపముగాగను జేసీ। ముగిదదొడగిన ముత్యాలారవి
కా ముళ్లను తావిప్పే। మేనుగంధము అలదుచునూ మేన గోరు
జల్లుచునూ। ఇన్నాళ్లావలెగాదె ఇంతిరో నీకుచగిరులూ। హేమక
లశమ్ములబోలెటి విత్తైయున్నవియేమే। అనికృష్ణుడుపలుకగనూ వి
నిరుక్మిణిసిగ్గుననూ। తలవంచుకు యున్నట్టీ సతికరములు తాబట్టీ।
గంధమ్మూ కస్తూరీ కలపముగాగను జేసీ। నాతిరో నీనాకరములు
మెరుపెవ్వరివనియడిగే। అనికృష్ణుడు పలుకగనూ వినిరుక్మిణినవ్వ
చునూ। కస్తూరికన్నా మెరుపూకమలనాభా మీకరమూ। కస్తూరిక

న్నా మెరుపని కడుహాస్యము చేయుదువా। తాజన్మించేటప్పుడుమ
ధురలోపలానింకా। తల్లికితండ్రికి వేసిన సంకెళ్లప్పుడువిడెనూ। పు
ట్టితియీధరలోపల పురుషుడనై మీకొరకూ। కష్టజాతులకూ నె
ల్లా గతులెల్లాగనపడగా। తనతండ్రీ వసుదేవుడు తనుతోడుకు
రాగానూ। రేపల్లేవాకిటనూ యశోదాకడనున్నా యోగమాయను
నీ తెమ్మని తాబంపెను కొలితానూ। రాపచ్చెట్టప్పుడు గదలెను గార్ద
భమప్పుడు గూసే। కాపున్నవారంతా కంసుని కెరిగించిరిగా। ఆ
మాటలు వినికంసుడు ప్రాణమ్ములుమూర్ఛల్లే। తాబడ్డామూర్ఛలు
తనలోనే తెలుసుకొని। తలముడివిడిపోగానూ ఖడ్గము చేబట్టుకొని।
పురిటింటికి జేరగ తావచ్చెను కంసుండపుడూ। వచ్చినకంసుని జూచీ
వసుదేవీ యిట్లనెనూ। అన్నరో వినరాయిది ఆడచిన్నది గదరా।
మొగశిశువూ కాదుగదా నినువధియించే కొరకూ। అని చన్నిన
బాలిచ్చుచూ కరమునద్దూకొనుచూ। అంతట వేకంసుడు తాబా
లిక చెయిబట్టీడ్చే। గిరగిరద్రిప్పాకాశముపాదుగున మెగరగ వేసే।
త్రుళ్లకురాయోరికంసా ఏలత్రుళ్లేవురయికనూ। నినుజంపెట వైరీ
రేపల్లెలో పెరిగేనూ। ఆపలుకులు వినికంసుని ప్రాణమ్ములు [illegible] ఛి
ల్లే। కొంతతడవుకా మూర్ఛగొని తానప్పుడు దెలిసే। పన్ను
గయేదుగుర్నిజంపితి పాపమునొడిగట్టుకుంటి। ప్రాణమ్ములకే నో
డితి నని కంసుడు తా వెడలే। అక్కడ వెడలీకంసుడు తననగరికి
యే తెంచే। పూతకినప్పుడు బంపెను భూకల్పునిజంప। చన్నువి
షముంచుకు నుతియించెను పూతాకి। రేపల్లేవాకిటనూ యశోదా
కడనున్నా। ఉయ్యాలాలోనున్నా చిన్నికృష్ణమ్మను జూసే। రావో
యీ నందకుమారా రావోయీ రత్నకుమారా। రావో రాజుల
హంసా గమ్మనుచును పూతాకి। ఆపలుకులువిని కృష్ణుడు అతివేగ
మ్మునవచ్చే। ఒక్కగుక్కకే పూతకివిషములు గ్రుక్కటబట్టే। రెం

డో గ్రుక్కకు పూతకి రక్తము గ్రుక్కిట్టబట్టే। మూడో గ్రుక్కకు పూతకి ప్రాణము గ్రుక్కిట్టబట్టే। గుటక గుటకలవిమూడూ గుటకలుగా దిగమ్రింగే। పెనుకొండావలె పూతకి పెరటింటిలో బడెనూ। కొట్టివేసిరీ పూతకనీ గొడ్డళ్లా పారంతో। రాసులుగాపోయించ్చి రేపల్లెవాకిటనూ। పచ్చన్నము దెచ్చియో బాలునికీ దిగదుడిచీ। బాలింతకిబోసీరె పర్వతమ్ములాపాడవూ। ఎర్రన్నము దెచ్చియోబాలునికీ దిగదుడచీ। చూలింతకు బోతూరే చుక్కల్లాపాడవూ। నా। కంసుడుబంపిన పూతకి కడు వేగమ్మునజచ్చే। దండిగ కంసుడు బంపెనురకసుణ్ణీ వేగా। బండిరూపమైవచ్చే గుండెవిరగ దన్నితిననెనూ। పశువుల బ్రాపకుల గా శెటిబకుణ్ణీజీరితిననెనూ। పాలదొంగిలగసితెల్లిరోలగ్గట్టెను మద్దులనూ। రోలీడ్చుకుమద్దులనూకూలగదన్నితిననెనూ। శత్రులు అంతరిక్షమ్మునపోవుచునుండగబూచీ। ఆగాలిసోకిననూ ప్రాణమ్ములుమూర్ఛల్లా। అటువంటికాళిందిలో అవలీలగదిగనురికీ। కాళింగునిశిరసుననూ కడు నాట్యము చేయుదునే। కంటకిదుండగీడానీ కాళింగుని తన్నుపుడూ। కాళింగుని సతులంతా కడు వేగమ్మునవచ్చి। కానుకలిచ్చేను మేమూ కడు వేగనాధునివదలూ। మాకు పెండ్లి శాయవెయూ ప్రాణావల్లభుకూ। ప్రాణమిచ్చి కావవే భక్తవత్సలా యనుచూ। నీవు జేసినదీ పెండ్లీ నికమ్మూ భద్రమ్మూ। చిన్ననాటిదీ పెండ్లీ మరి పెండ్లిగాదని పలికే। కాళింగుని మదమణచీ కడు వేగమ్మున అతనీ। వారిధిబొమ్మని ద్వీపాంత్రమ్ములు బంపితిననెనూ। దేవదేవమీమహాత్మ్యము తెలసీ తెలయక నేనూ। తెలసీ మీ పాదా సేవలుగోరితి ననెయూ। ఆపలుకులు విని మీకడ కంపితినే విప్రుణ్ణి। అతివేగమ్మునరమ్మనిఅంపితినే విప్రుణ్ణి। నాతిరో నీకేమైనా మనసులుకలిగున్నానూ। నాగలోకమంతానూ సాధించీ తెచ్చేనే। ఇంతిరో నీకేమైనా కోరికలుంటే జెప్పుమూ। ఇంద్రలోకమంతానూ సాధించీ దె

చ్చేనే। ముందురా మావ తోటములో మును పడిగిన కోరికలూ। తమ్ముని పాండవులకిచ్చి చంపబంపితిరీమీర నేమూ। నాకేమీ కోరికలూ లోకేశ్వర నాకిపుడూ। రాత్రిపూగలూ గూడుండుటమీతోడనే కోరికలూ। సతిపతులిద్దరు గూడుకు సంతోషమ్మున యుండ్రీ। నిద్రించెను శ్రీకృష్ణుడు నీరజాక్షితోగూడా। సత్యాంగనబంపిన చెలి సరగున తా చను దెంచే। ముడచినపువ్వులు జారగ అలదినగంధము చెమర్చ। బెదరిన అలలేడి పిల్లావలె వచ్చితివేమే। ఏమికార్యమ్ములు నేడూ ఇందీవరాక్షీరో। నాతోటీ జెప్పావే నాతోడూనీడారో। అకటారా వినవమ్మా నానకీక మొక్కడి సంసారములే। చక్రధరుడున్నాడే అక్కడ రుక్మిణీ నగరానూ। ఉన్నాడే శ్రీకృష్ణుడు ఉభయమ్మూలాతోనూ। ఆపలుకులు విని చెలిగూడ ప్రాణమ్ములుమూర్చిల్లే। గౌలత్రతడువుకా మూర్ఛకొని తానప్పుడు దెలసే। ఎంతే ధర్మాపతిరుక్మిణి అనిలోకులు మెన్నుదురూ। నాకు దెలసును రుక్మిణినైజము లప్పలుకులునూ। మత్తిల్లి శ్రీకృష్ణుడు మందుల లోపల కిచ్చి। మత్తైమామీద భ్రమలూపురచెనె గోపాలుండూ। పున్నమవెన్నెల కాయగపొన్నలగున్నలనీడా। తిన్నని స్వరమునప్పుడుకిన్నెరమీటుచు మెరయా। కలకంఠము తనతోడా। అలసీ మెలసున్నట్టూ। కలగన్నట్టాయగదే అలనాటీ ప్రేమాలనూ। అతిదుఃఖమ్ముతో భామా భూషణమ్ములుసల్లించీ। మైలవస్త్రమ్ములుగట్టెను మత్సరంబులాతోనూ। పూరింటీలోనొక్క కీలడుగూ మంచమునా। అలకా గృహముల కేగీ పవళించెనుసత్యాంగ్నా। అక్కడ రుక్మిణినగరిలో అతివలందరును గూడీ। కనక కసువులూ దుడచిరి కలయగ కస్తురి జల్లీ। ముత్యాల ముగ్గులు బెట్టిరి మందగమన లందముతో। రాజరాజ్యములానుంచీ రాజఋషులూ దేవఋషులూ। తొల్లైనబ్రహ్మ

ఋషులూ భూపతులూ యేతెంచ్రీ। హోమగుండంబులుతవ్వీరితము
ష్పగ విప్రులుతమరూ। ఘృతమునకుండలునిలిపిరి కడువేడుకతోడు
తెనూ। సన్నబియ్యపాగోనెలు రాసులుగాబోయించ్రీ। శ్రీకృష్ణుడు
యేడతుచూ అడిగెనువసుదేవుండూ। ఏవేళా శ్రీకృష్ణుడు వేలా స్త్రీల
తోనుండూ। ప్రియముతో పిన్నలపెద్దలపిలివస్త్రీనియపకీర్తి। బాలుని
తో సంసారముచేసుటఇదితప్పనెనూ। ఆపలుకులువిని చెలులూ అ
తిభయపడుచును వెళ్లే। మేలిమైనకనకంపూ పేడలదరికితెంచీ। లే
చిరి కృష్ణా లెమ్మని చెలులందరు లేపగనూ। కల్లినుసుముచును లేచె
ను కడు వేడుకతోనూ। చప్పుడు గాకుండా తనసతిదాయకుయే
తెంచీ। తొడ చరిచీ తెనసతినీ లేలెమ్మనుచును లేపే। సిరులాలికి
ముఖమునసనూ చెలువాడగ తీపీనీ। దటదట నడచిన రుక్మిణిచూచి
గొయ్యాకృష్ణుండూ। నాతిరో స్త్రీలకునెల్లా మెల్లగ నడువగవలె
నూ। గర్భిణిస్త్రీలకు నెల్లా కదలక నడువగవలెనూ। కొడుకూ
కోడలుయిద్దరు మేడమెట్లు దిగిరాగా। కన్నులపంటనలా వెసువ
సుదేవుడు దేవకికి। పనిచారుల బిలపించీ సవతులతోడితెమ్మనెనూ।
ఆపలుకులువిని చెలులూ ఆనందముపడుతూనూ। అక్కడవెడలీ చె
లులూఅతిసంభ్రమముతోడుతనూ। సత్యాంగనఅయినట్టీ సత్యాంగ
ననగరికివెళ్లి। అక్కరో వినవమ్మా మనఅక్కకుసీమంతములూ। శా
యగవలెనని కృష్ణులు ఆము రాబంపెను వేగా। అక్రూరునినగరికివిం
దుకుఆరగింతమని వెళ్లి। మానుబాంకించీ యుల్ప్రదువనజాతుడు తా
వెళ్లే। అటువంటి శ్రీకృష్ణుకుఅతడేలా రాబంపూ। అక్కరుక్మిణిబం
పిందనిపలికెనుసత్యాంగనతానూ। కోపులి కృష్ణునిమీదను కోపించీ
రానసెనూ। నిపు రాకుంటే మేలని తరుణులునవ్వుచుజనిరీ। అక్క
డవెడలీ చెలులూఅతిసంభ్రమముతోడుత్రనూ। రాధాంగనమైనట్టీ రా
ధాంగననగరికివెళ్లి। అక్కరో వినవమ్మా మనఅక్కకు సీమంతము

లూ। శాయగవలెననికృష్ణులుమిమురాబంపెను వేగా। ఆపలుకులువిని రాధా ఆనందముతోడుతనూ। పలువిధభూషణములు శృంగా రించెను వేగా। అక్కడ వెడలీచెలులూ అతిసంభ్రమము తోడుతనూ। భద్రాంగనమైనట్టిభద్రాంగననగరికివెళ్ళి।అక్కరో వినవమ్మా మన అక్కకుసీమంతములూ। శాయగవలెననికృష్ణులు మిమురాబంపెను వేగా।ఆపలుకులువినిచెలియాఅతిసంభ్రమముతోడుతనూ।అతివతెనా భరణమ్ములు వేగాయలంకరించుకునీ। జిలుగుబంగరూపోకా చీరెగ ట్టెను వేడుకతో। అక్కడ వెడలిచెలులూ అతిసంభ్రమము తోడుతనూ। మిత్రవైనట్టి మిత్రవిందనగరివెళ్లే। అక్కరో వినవమ్మా మనఅక్క కు సీమంతములూ । శాయగవలెనని కృష్ణులు మిమురాబంపెను వే గా। అక్కడవెడలీచెలులూ జాంబవతినగరికి వెళ్లి। అక్కరో వినవ మ్మా మనఅక్కకు-సీమంతములూ। శాయగవలెనని కృష్ణులు మిము రాబంపెనువేగా। అక్కడ వెడలీ చెలులూ కాళిందీనగరికివచ్చి। అ క్కరో వినవమ్మా మనఅక్కకు సీమంతములూ। శాయగవలెనని కృ ష్ణులుమిమురాబంపెను వేగా। అక్కడవెడలీచెలులూ సూదంతీనగ రికివెళ్ళి।అక్కరో వినవమ్మా మనఅక్కకుసీమంతము లూ। శాయగవ లెననికృష్ణులు మిము రాబంపెను వేగా। అక్కడవెడలీచెలులూ అ తిసంభ్రమముతోడుతనూ। పదియారువేలా స్త్రీలకు చెప్పిరి వేడుకతో నూ। అక్కలార వినరే మనఅక్కకుసీమంతమ్మూ। శాయగవలెనని కృష్ణులుమిమురాబంపెనువేగా। ఆడేటిసౌగటాలూ అతివలునెత్తా మరిరీ। అతివలుయాభరణంబులు యలంకరించుకువేగా। జిలుగుబం గరూపోకా చీరెలుగట్టిరి వేడుకతో। పలువిధభూషణములుసౌగ సుగశృంగారించిరి। పళ్లుఫలమ్ములు బంగరుపళ్లెరములనుంచుకునీ। క దలిరిపదియారువేలా కడు వేడుకతోడుతనూ। కృష్ణునిపట్టపురాణు లు పదియారువేలాచేరుగురూ । నడువగ రజముఃధూళీ దినకరు క

లరుగగప్పే। పగలేఅస్తామయమూఆమెమయిది యేమనెనూ। ఆ
శ్చర్యమ్ములబడుచూఆకాశముబుజూచిరి। కృష్ణునిపట్టపురాణులు
పదియరువేలారుగురూ। నడవగ రజములధూళీ దినకరు గలయ
గగప్పే। సీమంతపుహోమమ్ములువేల్పేటి చోటికినీ। కదలిరిపదియ
రువేలూ కడువేడుకతోడుతనూ। శ్రీకృష్ణులు శ్రీరుక్మిణి జలకమ్ములు
యాడగనూ। గంధమ్మూకస్తూరీకాంతలునలుగీడుదురూ। సుగంధిజ
లములరుక్మిణీదేవికి జలకములార్చిరి। నిండువన్నెతల్లోత్తిరి నీరజా
క్షికివేడుకతో। బంగరుపట్టుపీతాంబ్రముకట్టనిచ్చిరి వేడుకలా। సఖి
యకుతలకురులార్చిరి సంపెంగావిరులానూ। బంగరు మొగలీరేకు
ల పటుసవరపు కొప్పికిరీ। ఇరుగడలా సూర్యాచంద్రాదుల నమ
రగసిలిపి। హరిశ్చంద్రాముత్యాలాబొట్టునుమెరయగనుంచ్రీ। కెళిం
చిన ముత్యాలూ బావిలీలు మెరయగనూ। శశిపువ్వ మెరగనుం
చెనుచంద్రవదన వేడుకతో। ముూపునతీగెలు బెట్టెను ముగ్ధరాలు వేడు
కలా। ఒడ్డాణమ్ములు బెట్టెను వైడూర్యమ్ములు మెరయా। ఒత్తులుభు
జకీర్తులు బెట్టెను వైడూర్యమ్ములు మెరయా। పాదమునందెలు బెట్టె
ను పాంపట్టమ్ములు మెరయా। నెమలను కులపిల్లాళ్లూ నవముద్రిక
లు మెరయగనూ। చిటికెనపాద్దులు బెట్టెను శ్రీరుక్మిణితనవ్రేళ్లా।
పంచరత్నమ్ముల భటువులు పంకజాక్షి ధరియించి। కస్తూరితిలకము
దీర్చెను కమలాక్షితన నుదుటా। సోగకన్నులా సన్నపుకాటుకల
మరగదీర్చి। చేడెకు చంద్రాకావీరవిక్కె తొడగిరి వేడుకతో। శృం
గారమ్ములు జేసిరి శ్రీరుక్మిణిదేవికిని। సీమంతపు పీటలపైగూర్చుండా
తమరుంచ్రీ। పళ్లుఫలమ్ములు రుక్మిణివడినింపి రెసవతులునూ। హాస్యం
బులవారెల్లా హాస్యమ్ములు చేయుదునూ। పరిహాస్యంబుల వారూ
గోపాలుని తమరపుడూ। మంగళహారతులిచ్చిరి మగువలు గో
పాలునికి॥

## మంగళహారతి.

అంగనాలు ముద్దు శృంగారమిందినీకు। సంగాతిగామెంతో రం
గామూనా। కొంగుబట్టీచిన్నా గోపికాలిండ్లాలో। దొంగా తాన
ముకాయా దొరవా రా శ్రీకృష్ణా॥ మంగాళం మంగాళం॥ ముద్దు
లకృష్ణా మంగాళం మంగాళం॥ అంచియానావాలూ పొంచీ యి
ల్లాజొచ్చీ నేననచూవచ్చీ। మంచీపాలాకడవా అంచూనోటాబట్టీ।
వంచూకూతాగినా వరదూడవాకృష్ణా। మంగాళం మంగాళం॥
ముద్దులకృష్ణా మంగాళం మంగాళం॥ పాలూమీగాడంతా చాలా
మూతికి రాసి। వేలూజూపీ దానీగేలూ జేసీ। చూలూ నిల్పీ చిన్ని
బాలూమగలదానీ కోలాహలమూ కాయా గోపాలా శ్రీకృష్ణా॥
మంగాళం మంగాళం॥ ముద్దులకృష్ణా మంగాళం మంగాళం॥ ఇ
ష్ణా మెసలొచ్చీ గొల్లా యిల్లాలా పై పూలచెండ్లూ వేసీ పాలిండ్లా
బట్టీ। కళ్ళూచూపీ వెన్నా కడవాలన్నీ పెరుగూదొల్లా బాడచీనట్టి
దొంగావురా కృష్ణా॥ మంగాళం॥ పీటాలెత్తూ బెట్టి పెరుగూ కుం
డకుచిన్నీ తూటూబాడచీ క్రిందా దోసీలొగ్గీ। సూటిగానూ గూ
డి సుదతూలాయిండ్లా లో నేనైనా క్షీరాబ్ధి సిలయూడందురు కృ
ష్ణా॥ మంగాళం మంగాళం॥ రాచాకేళులచె రమణూల గొందరి
ని భాషాబంధించీ వనమందూ తిరుగుదూ। వాసిగానూ గూడి వ
లువాలు కొందరివి మోసా బుచ్చీవట్టీ ముద్దూలా శ్రీకృష్ణా॥ మం
గాళం మంగాళం॥ చెట్లాలో పలనిలచీ బొమ్మైకోకలుబూనీ చెట్లా
కెగి। అట్టేరమ్మనిపిలచీ అతివాలా నీవలుదు కొట్లాకోర్చినట్టి గో
పాలా శ్రీకృష్ణా॥ మంగాళం మంగాళం॥ ముద్దులకృష్ణా॥ మంగాళం॥
మంగళహారతులిప్పిరి మగువలు గోపాలునికి। సత్రాజిత్తుని పు
త్రిక సత్యాంగన మేదనిరి। కోమలి శ్రీకృష్ణునిపై గోపించీ రానసె
మా। కొడుకూబక్కడె గానీ కోడళ్ళూ పెక్కండ్రూ। నగధరుని

శృంగారము నగరం తా సింఢినదీ। ఇందరు యింతులలో పల రూపసి యెవరని పలికే। నెమ్మత్రైనాకొప్పూది నెమలి పురి తుంచాది। వెనుక కులంగారూ చిత్తరవులు గలిగినదీ। తెనభారపు పలుకులకూ తరుణీ గో నైయుందూ। కోమలి రుక్మిణి చక్కనిదని పలికెను కృష్ణుం డా। ధనటంకంబులు కొన్ని ఘనరత్నంబులు కొన్ని। బంగరు తబుకులతో నూ పంచిబెట్టించెను రాజూ। కన్యాదానంబులకూ కడులేని వస్త్ర లూ। బంగరు తబుకులతోనూ పంచిబెట్టించెను రాజూ। భూదానం బులు కొన్ని గోదానంబులు కొన్ని। వేడుకతో వసుదేవుడు చే యించెను తానప్పుడూ। వచ్చినవారికి నెల్లా పాకంబులు చేయిం చే। అప్పమ్ములు అతిరసములు ఒప్పుగ వటిచిటిబూర్లూ। గొప్పప్ప డమ్ములు మొదలుగ వండెను దేవకీదేవీ। వెన్నప్పమ్ములు మంచీమను గుపూవులాతోనూ। వచ్చినవారికి నెల్లా పాకంబులు జేయించే। ఎల్ల రాజ్యంబులనుంచీ యేతెంచిరి భూపతులూ। వేడుకతో గోపా లుని బంతులు సాగించిరిగా। దివ్యాన్నమ్ములు పెకూరు పిండివంటలు కూరగాయలనూ। పచ్చళ్ళూ మొదలయినా పంచభక్ష్యపరమాన్న ములూ। దధిమధుఘృతసూపమ్ములు వడ్డించిరి యింతులునూ। ఆర గించివారెల్లా హస్తంబులు గడుగుకుని। పాలువెయ్యిస్తంభములా మేడలలోకి తెంచ్రీ। చిరిచాపలూ మంచీ రత్నకంబళ్లూ బరిపించ్రీ। సవతులనందరినీ తా కూర్చుండగనియమించే। కర్పూరపు వీడెమ్ము లు కాంతలకూ యిప్పించే। మణిరత్నంబులు కొన్ని మణిహారంబు లు కొన్ని। మేలిమైన చీరెలతో కట్నమ్ములు యిప్పించే। కట్నంబులు అందుకునీ కాంతలు సంతోషమునా। పుత్రుడు గలిగిననాటికి అ కరిగా వత్తుము అనిరీ। సీమంతము జూడగనూ కన్నులకరువులు దీ రే। సంతోషమ్ములు మాకూ సెలవులు మొసగవె అనిరీ। సెలవులు రుచ్చుకు చెలులూ ఆనందముతో మతరూ। అందరు గూడుక తమ।

తమ గృహములకే చనుదెంచ్రీ। పంకజాక్షి రుక్మిణి తన పతికడ కూ చనుదెంచే। సత్రాజిత్తుని పుత్రిక సత్యాంగన యలిగివదీ। పచ్చలపతకము లిచ్చెద పరమాత్మా మీకనేమూ। భామామణిరో సత్యాభామకు అలకలుదీరవు। పాషాణము ఆ సత్యాభామామణికోపమ్మూ। భామకు అలుకలుదీర్చా అదినాతరమే గాదూ। నక్షత్ర కంఠమాలా సగము శృంగారము దీసీ। పంకజాక్షి రుక్మిణి తన పతి చేతికి వందిచ్చే। మెచ్చుచు కోమలి గుణములనవ్వుచు గోపాలుండూ। సాలు వెయ్యి స్తంభాలా మేడలదరికే తెంచే। తాళాలూ తప్పెట్లూ దరువులు మ్రోయగ లేమూ। అలిగివదో సత్యాంగన అనుచును గోపాలుండూ। కీరములే పలుకావూ కోవిలలేయయ్యావూ। హంసలు అందం దాడవు అనుచును గోపాలుండూ। శృంగారము వెలుబల్లా నసుర్చ [illegible] శ్రీకృష్ణుండూ। అతివను [illegible] దగ్గను మధుసూదనుడప్పూ దూ। ఇంతులార మిమ్మేలెటి ఇంతేదనియడిగినమూ। [illegible] డా బోయెనోయని పలికిరి చెలులంతా। ఇందరు ఇంతులనేలుట ఇదికీడనె కృష్ణుండూ। అతిడగు శ్రీకృష్ణుడు అతిడగు శ్రైబలికే। ఆపలుకులువిని చెలులూ అతిభయపడుచూవచ్చి। వాచానా మేమెరుగము చెయి సంజ్ఞల మాపించే। పూరింటిలోనో కాకీలడుగూ మంచము పై। అలకగృహంబున కేగి సత్యాంగన బవళించె। తలుపు క్రిందపామాయీ సర్వేశుడు తావెళ్లే। ఇంతి చేతి వీవనమూ పుచ్చుకు తానే విసరే। ఇందాకా లేనివింతా యీవింతా వాసనలూ। వింతవాసనలకు ముసుగూ తొలగించీ తా జూచే। హరియని తెలసీ భామామళ్లీ ముసుగులు బెట్టే। యింతకన్నా రుక్మిణికీ యేమిచ్చెను వులు యిచ్చేనే। పదిమందీ దాసీలే పణతిరుక్మిణీనగరా। పదివేల దాసీలే పంకజాక్షినీనగరా। నవరత్నపు భూషణమ్ములు నాతిరో నీగడపలనూ। కోమలి రుక్మిణి దేవికి భూషణమ్ములు సహాలేవే। బంగార

వు మేడాలేపసికిమిద్దెలేకోన్ని। సర్వరాజ్యవైభోగము సతిసీవాడ
నెనేమా। మంగళవతులైనట్టీ మగువలకల్లానిపుడూ । శృంగారము
మొన్నడుసూ చెవిరుండగ రాదనెసూ । కలవరేకుల బోటెటి కలిక
రోసీకన్నులకూ। కాటుకకన్నులనీరూ గారుట యిదియేమనెసూ।
ఆపలుకులువినిచెలియా అతిదుఃఖమ్మునబలికే। అక్రూరునినగరికివిం
దులు ఆరగింతుమనివెళ్లీ। మమువాంకించీ వేగావనజాక్షా దిరువె
ళ్ళీ। అక్రూరుడెసతియామైన అతివేగమ్మునమీకూ। అక్రూరుడెవ
సియూడెట్టి నడుమక్కడ నడిగితిరో। ముందుగచెలులకు లంచము
యివ్వక నేమోసపోతీ । ఏకాంతపు గృహములకూ యేగితినీ యి
నెనూ। పచ్చలపతకము దెస్తిని పంకజాక్షిరో బూడే। అందుకునీ ఆ
భామా ఆనందము బడుచూనూ । సతిపతులిద్దరు గూడుక సంతో
షమ్మునుండ్రీ । నిద్రించెను శ్రీకృష్ణుడు నీరజాక్షియు వేడుకతో
అక్కడవసుదేవకి తన ఆత్మ చెలుల బిలచుకునీ। కాంతలో మన రు
క్మిణికీ నవమాసమ్ములునిండే। శ్రీకృష్ణుడు లేడావెను తోడుకురమ్మ
నిపలికే। సత్యభామనగరికినీ సరగునతమరేతెంచీ। నిద్రించీ యున్న
ట్టి నీరజాక్షునీపాడగాంచీ॥

మేలుకొలుపులు.

బంగారూచెంబుతో పన్నీరుబట్టూకూ పణతిరుక్మిణివచ్చే మేలు
కో॥ రంగైనాపావలూ రంగేలాబూడూకూ రమణిసత్యాతోనూ।
మేలుకో। దంతాకాష్ఠమంబూనీ తామారాసాక్షి సూదంతీవచ్చిన
దయ్యామేలుకో। అంతాకుమున్నూరూకూలా బట్టుకుజాంబావం
తూని సుతవచ్చేమేలుకో॥ అందామైనా నిలువుటద్దామూగొని మి
త్రావిందావచ్చినదయ్యా మేలుకో। పొందుగాకస్తూరీభరిణాబట్టు
కు కాళిందీవచ్చిన దయ్యా మేలుకో॥ సూటీగానీపైనీ పాటాలూ
బాడూతూ సూభద్రా వచ్చినదయ్యా మేలుకో। వాలాయముగ

తాంబూలాములట్టూకూ రాధాంగీవచ్చినదయ్యా మేలుకో॥ ముదముతో ఏతేవా ఋంపుమా శ్రీలక్ష్మీవచ్చినదయ్యా మేలుకో। వదియరూ వేలా గోపికలెల్లాసొగటాలాపాడే దెచ్చున్నారూ మేలుకో। మేలూకో యశోదా నందాకుమారాకా మేలూకో శ్రీకృష్ణా మేలూకో। మేలూకో దయతోడా వేగా గావచ్చేనూ తెల్లావారా వచ్చే మేలుకో॥

అనికాంతలులేపగనూ వినికృష్ణుడువేమకతో। కాంతలవద్దకువచ్చెను కడుసంభ్రమముతోడుతనూ। శ్రీరుక్మిణినీల్లాడగ వేళలాయెనూ శ్రీకృష్ణా। వసుదేవుడు దేవకి మిము రాలంపెనుమ్మ నెనూ। సంతోషమ్మునకృష్ణుడునతిశైననూ శొప్పకనూ। ఆనందమ్మునకృష్ణుడు అతివేగమ్మునవచ్చే। నవమాసమ్ములునిండెనునాతి శ్రీరుక్మిణికి। పంకజాక్షి రుక్మిణికి బాలుడుతానుదయించే। దశదినమ్ములూ గడచెను దేవకి మజ్జనమార్చే। పగడుమీదభారసాల చేసెనె వసుదేవుండూ। మన్మధుడనుచునువారూ మరినామమునిచిరిగా। భూదానమ్ములుకోట్లుగోదానమ్ములుకోన్ని। అశ్వదానమ్ములుకోన్ని వరుసగ జేసెనెరాజూ। కన్యదానమ్ములకూ కడు లేనీ వస్త్రవ్రలూ। బంగరుతబుకులతోనూ పంచిపెట్టించెనె రాజూ। వచ్చిన వారందరికీ పాకమ్ములు చేయించే। అప్పమ్ములు అతిరసములు ఒబ్బ్బుగ వటిబిటబూరెలు। గొప్పప్పడమ్ములు మొదలుగ వండెను దేవకదేవి। వెన్నమురుగు వెన్నప్పములు గారెగుల్పుఫులాతోనూ। వేడుకతో గోపాలుని బంతులనూ వడ్డించే। దివ్యాన్నమ్ములు పెసర్పప్పిండివంటలుకూరగాయలనూ। పప్పుశాకా మొదలయినా పంచభక్ష్యపరమాన్నములూ। దధిమధుఘృతసూపమ్ములు వడ్డించిరి యింతులునూ। ఆదధిఘృతసూపమ్ములు వడ్డించిరి ఇంతులునూ। అరగించివారెల్లా హస్తములాగతాసుకునీ। కర్పూరకలువీడాయులూ కడు వేడుకతోనిచ్చిరిగా। అతిసంభ్రమముతో

డుతనూ అందరుతమగృహములకే తెంచ్రీ। శ్రీరుక్మిణిసీమంతము పాడినవారికినెల్లా । విన్నవారికినెల్లా విష్ణులోకము గద్దనెనూ। శ్రీరుక్మిణిసీమంతము పాడినవిన్నాగానీ। స్త్రీలకు పుత్రులుగలుగుదురని శ్రీకృష్ణుడు తాబలికే॥

శ్రీరుక్మిణీదేవి సీమంతము

సంపూర్ణము.

---

# ప్రకటన.

## విక్రయమునకు సిద్ధముగానున్న పాటల పుస్తకములు.

| | | |
|---|---|---|
| ౧ | కుశలవచరిత్ర (కుచ్చలకథ) | ౦-౬-౦ |
| ౨ | లంకాయోగము. | ౦-౨-౦ |
| ౩ | గుహ, భరతులఅగ్నిప్రవేశము. | ౦-౨-౦ |
| ౪ | పట్టాభిషేకము, సీతసురటి. | ౦-౩-౦ |
| ౫ | లక్ష్మణజీవరనవ్వు, ఊర్మిళాదేవినిద్ర. | ౦-౨-౬ |
| ౬ | సీతసమర్త. ... ... | ౦-౧-౦ |
| ౭ | సీతయానవాళ్లు. ... ... | ౦-౧-౦ |
| ౮ | శ్రీకృష్ణునిచల్లులు. ... ... | ౦-౧-౦ |
| ౯ | చిలుకరాయభారము. ... | ౦-౦-౬ |
| ౧౦ | రుక్మిణీదేవి సీమంతము. ... | ౦-౧-౦ |

౫, ౬, ౭, ౮ నెంబర్లుగలపాటలు తయారగుచున్నవి. కొంచెము రోజులలోనే విక్రయమునకు సిద్ధముకాగలవు.

ఈపుస్తకములు వాల్యూపేబిల్‌గా తెప్పించుకొనువారికి రెండణాలు పోస్టీ అగును.

కావలయువారు విశాఖపట్టణనివాసులగు మ॥ రా॥ శ్రీ తాప్రగడ చలంపంతులుగారిపేర వ్రాసి తెప్పించుకొనవలయును.